సీ. కవ్వపుమల తరి♦గట్టన సుందరం
బడరుఁ దూరుపుమల ♦ పొడుపుఁదిప్ప
మొదటికొండ యనంగ ♦ నుదయాచలం బొప్పుఁ
బడమటిమల గ్రుంకు♦పుడమితాల్పు
నాస్తగిరి కగు ♦ ఱాయి ఱా కల్లనఁ
బ్రస్తరాఖ్య దలిర్చుఁ ♦ బల్లె యూరు
కుప్పం బనఁగ గ్రామ ♦ మొప్పును బ్రోలు వీ
డనఁ బట్టణముపేరు ♦ లలరుచుండు
తే. నిరవు సెంకి యునికి యిక్క ♦ యిల్లు గీము
మనికి పట్టు బిడారు కొం♦ప యిలు నెలవు
నట్టు తావ వన మందిర♦నామము లగు
శంబరాహితమదభిదా♦డంబ సాంబ. 56

టీ. కవ్వపుమల=దేవతలకుఁ గవ్వమైనకొండ, తంగట్టు = క్షీరసముద్రమును జిలికినకొండ – ౨ మందరపర్వతము. తూరుపుమల = తూర్పుదిశనుండు కొండ, పొడుపుఁదిప్ప = సూర్యుఁ డుదయించుకొండ, మొదటికొండ=తూర్పుననుండు కొండ – ౩ ఉదయపర్వతము. పడమటిమల = పడమటిదిశనుండెడి కొండ, గ్రుంకుపుడమితాల్పు=సూర్యుఁడ స్తమించెడి భూధరము – ౨ అస్తమానపర్వతము. ఱాయి, ఱా, కల్లు – ౩ శిల. పల్లె. రూ. పల్లియ, ఊరు, కుప్పము–౩ గ్రామము. ప్రోలు, వీడు–౨ పత్తనము. ఇరవు, సెంకి, ఉనికి, ఇక్క, ఇల్లు, గీము (ప్ర. గృహము), మనికి, పట్టు, బిడారు,కొంప, ఇలు, నెలవు, నట్టు, తావు (అన్యదేశ్యము). రూ. తావు – ౧౫ నివాసము.

సీ. టెంకాయచెట్టనఁ ♦ డేమ్రాను నారిక
డం బన నారికే♦ళంబు దనరుఁ

తాడనఁ దాళ మౌ ♦ దాళిమ్మ దానిమ్మ
యన దాడిమియుఁ బొన్న ♦ పొన యనంగఁ
బున్నాగము దనర్చు ♦ గన్నేరు గన్నెరు
నాఁగను గరవీర♦నామము లగు
రేఁగు రే నన బద♦రికిఁ జెల్లు మారేడు
బిలువ మనఁ దనర్చు ♦ బిల్వమునకు
తే. జమ్మి జం బన శమి యగుఁ ♦ జంపకంబు
దనరు సంపెఁగ సంపఁగె ♦ యనఁగ నెల్లి
యుసిరి యుసిరిక యన ధాత్రి ♦ కొప్పు రాగి
యనఁగ రా వన నశ్వత్థ ♦ మొనరు సాంబ. **57**

టీ. టెంకాయచెట్టు. రూ. తెంకాయచెట్టు, టేమ్రాను. రూ. తేమ్రాను, నారికడంబు – ౩ నారికేళవృక్షము. తాడు– ౧ తాటిచెట్టు. దాళిమ్మ, దానిమ్మ – ౨ దాడిమీవృక్షము. పొన్న, పొన– ౨ పున్నాగవృక్షము. గన్నేరు, గన్నెరు– ౨ కరవీరవృక్షము –కస్తూరిపట్టెచెట్టు. రేఁగు, రేను – ౨ బదరీవృక్షము. మారేడు, బిలువము– ౨ బిల్వవృక్షము. జమ్మి, జంబు – ౨ శమీవృక్షము. సంపెఁగ, సంపఁగె. రూ. సంపఁగి – ౨ చంపకవృక్షము. నెల్లి, ఉసిరి, ఉసిరిక – ౩ ఆమలకవృక్షము. రాగి, రావి – ౨ అశ్వత్థవృక్షము.

సీ. అత్తి మేడి యనంగ ♦ నౌదుంబరం బొప్పు
మావి మామి డన నా♦మ్రము దనర్చు
వెలఁగ వెలంగ నా ♦ వెలయుఁ గపిత్థంబు
మల్లె మల్లియ నాఁగ ♦ మల్లిక యగు
జాజి జాది యనంగ ♦ జాతి యౌ నేరేడు
నేరెడు నా జంబు ♦ నెగడుచుండుఁ

బాదిరి కలిగొట్టు ♦ నాఁ దగుఁ బాటలి
పొగడ పోవ డన నొ♦ప్పును వకుళము
తే. మ్రాఁకు మ్రాను చెట్టనఁగ ద్రు♦మంబు చెలఁగుఁ
దీఁగ తీఁగియ లతకూన ♦ తీఁగె యనఁగఁ
దనరు లత పేరు పూవులు ♦ ననలు విరులు
పువ్వు లలరులు నా సుమం♦బు లగు సాంబ. 58

టీ. అత్తి, మేడి - ౨ అత్తిచెట్టు. మావి, మామిడి - ౨ చూతవృక్షము. వెలఁగ, వెలంగ - ౨ కపిత్థవృక్షము. మల్లియ, మల్లె - ౨ మల్లెతీఁగ. జాజి, జాది - ౨ జాతీలత. నేరేడు, నేరెడు - ౨ జంబూవృక్షము, పాదిరి, కలిగొట్టు - ౨ పాటలీవృక్షము. పొవడ, పొగడ - ౨ వకుళవృక్షము. మ్రాఁకు, మ్రాను, చెట్టు - ౩ వృక్షసామాన్యము. తీఁగ. రూ. తీవ, తీఁగియ. రూ. తీవియ, లతకూన (ఇది మిశ్రపదము.), తీఁగె. రూ. తీవె - ౭ లత. పూవులు, రూ. పూలు. ననలు, విరులు, పువ్వులు. రూ. పువులు, అలరులు-౭ పుష్పములు.

సీ. మొక్క మోటిక మోసు ♦ మోక మొలక యన
నంకురనామంబు ♦ లలరు నిగురు
తలిరు చిగురు నాఁగఁ ♦ దగుఁ బల్లవాఖ్యలు
కొన తుద యన నగ్ర♦మునకుఁ బొల్చుఁ
దొఱ తొలి తొఱ్ఱ నాఁ ♦ దరుకోటరం బొప్పుఁ
దమ్మి తామ రనఁ గం♦జమ్ము పరఁగుఁ
దొగ తొవ కలు వనఁ ♦ దగు నుత్పలమునకు
దట్టంబు జొంపంబు ♦ తఱుచు జీబు
తే. గుమురు తంపర యన నిబి♦డము దనర్చు
మొగడ మొగ్గ యనం దగు ♦ ముకుళమునకు

నిక్షుకాండంబునకుఁ బేరు ♦ లెసఁగుఁ జెఱకు
కనులుగల మ్రాను తియ్యమ్రా ♦ ననఁగ సాంబ. 59

టీ. మొక్క, మోటిక, మోసు, మోక, మొలక – ౫ అంకురము. ఇగురు, తలిరు, చిగురు – ౩ పల్లవము. కొన, తుద – ౨ అగ్రము. తొఱ్ఱ, తొఱ్ఱి, తొఱ్ఱ – ౩ కోటరము – వృక్షమునందలిరంధ్రము. తమ్మి, తామర – ౨ కమలము. తొగ, తొవ, కలువ. రూ. కల్వ – ౫ ఉత్పలము. దట్టము, జొంపము, తఱుచు, జీబు, గుముగు. రూ. గుబురు, తంపర – ౭ దట్టమైనది. మొగడ, మొగ్గ – ౨ ముకుళము. చెఱకు, కనులుగలమ్రాను = గణుపులుండునట్టివృక్షము, తియ్యమ్రాను – ౩ చెఱకుగడ.

సీ. తెలుపు తెల్లన తెల్ల ♦ తెలి తెల్ల వెలి యన
ధవళవర్ణ మెసంగుఁ ♦ దొవరు తొగరు
కెంజాయ యెఱుపు వెఱ్ఱి ♦ కెంపన రక్తవ
ర్ణము గు నల్లన కఱి ♦ నల్ల కప్పు
నలు పన నీలవ♦ర్ణము పొల్చుఁ జామన
పసరుచా యన శ్యామ ♦ మెసఁగుచుండు
నళిది పసు పనంగ ♦ నగుఁ బీతవర్ణంబు
తేట నున్నన నున్న ♦ తెలివి నునుపు
తే. నిద్ద మన స్నిగ్ధత కెసంగు ♦ నిగ్గు డాలు
మినుకు మిన మించు నిగ తళ్కు ♦ మెఱుఁగు చికిలి
కళుకు జిగి రంగు మెఱ పనఁ ♦ బొలుచుఁ గాంతి
నొడ్డు దరి గట్టనఁగఁ గూల ♦ మొనరు సాంబ. 60

టీ. తెలుపు, తెల్లన, తెల్ల, తెలి, వెల్ల, వెలి – ౬ శుక్లవర్ణము. తొవరు, తొగరు, కెంజాయ (ప్ర. కెంపు + చాయ), ఎఱుపు, ఎఱ్ఱ, కెంపు – ౬ రక్తవర్ణము. నల్లన, కఱి, నల్ల, కప్పు, నలుపు – ౫ నీలవర్ణము. చామన, పసరు

ఛాయ - ౨ నలుపు తెలుపు గలిసినవర్ణము. అళిది, పసుపు - ౨ పీతవర్ణము. తేట, నున్నన, నున్న, తెలివి, నునుపు, నిద్దము (ప్ర. స్నిగ్ధము.) - ౬ విర్మలత్వము. నిగ్గు, డాలు, మినుకు. రూ. మిన్కు, మిన, మించు, నిగ, తళుకు. రూ. తళ్కు, మెఱుఁగు, చికిలి, కళుకు, జిగి, రంగు, మెఱపు - ౧౫ కాంతి. ఒడ్డు, దరి, గట్టు - ౩ తీరము.

సీ. ఆణి చినుకుఁబూస ♦ పాణి సుప్పాణి ము
 త్తెము ము త్తియంబు ము♦ త్య మనఁ దనరు
మౌ క్తికాఖ్యలు కెంపు ♦ మానికము రతన
 మనఁగ మాణిక్యాహ్వ♦యంబు లలరుఁ
బగడముపవడం బ♦నఁగ విద్రుమము పొల్చుఁ
 బక్కరాయనితాయి ♦ పచ్చ యనఁగ
మరకతము దలిర్చు ♦ మగతాలు మూలతా
 లన వజ్రము లగుఁ బు♦ ల్లంటుతాయి
తే. కప్పుతాయి యనఁగ నీల ♦ మొప్పుఁ బిల్లు
 పూరి చిగిరింత యేట్రింత ♦ పొనుఁగు గడ్డి
 గఱిక పచ్చిక వెఱుతురు ♦ కసవు తుంగ
 విడవలి యనఁ దృణాఖ్యలు ♦ వెలయు సాంబ. 61

టీ. ఆణి, చినుఁకుబూస, పాణి, సుప్పాణి, ముత్తెము, ము త్తియము, ముత్యము - ౭ ముక్తాఫలము. కెంపు, మానికము, రతనము (ప్ర. రత్నము.) - ౩ మాణిక్యము. పగడము, పవడము - ౨ ప్రవాళము. పక్కరాయనితాయి, పచ్చ - ౨ మరకతమణి. మగతాలు, మూలతాలు - ౨ వజ్రములు. పుల్లంటుతాయి, కప్పుతాయి - ౨ ఇంద్రనీలమణి. పిల్లు, పూరి, చిగిరింత, ఏట్రింత, పొనుఁగు, గడ్డి, గఱిక, పచ్చిక, వెఱుతురు, కసవు (ప్ర. ఘాసము.), తుంగ, విడవలి - ౧౨ తృణభేదములు.

సీ. ఎల్లి చుట్టువు గొడు • గెండమఱు వనంగ
ఛత్రంబు దనరు ధ్వ • జంబు పేళ్లు
టెక్యము టెక్కెము • టెక్కెయము సిడంబు
పడగ డా లనఁ జెల్లు • నిడివి నిడుద
సోగ నిడుపు చాఁపు • నాఁగ దీర్ఘమున కౌ
మఱుఁగు చాటోలము • మఱు వనంగఁ
దగుఁ బిధానాఖ్యలు • జగతి జగిలె తిన్నె
యరుఁ గన వేదిక • కమరు నేల
తే. యిల పుడమి మన్ను బువి పంట•వలఁతి యనఁగ
ధరణి కగు విప్పు వెడలుపు • విరివి పఱపు
వెడఁద యన విస్తరాఖ్యలు • వెలయుఁ బైరు
ససి యనఁగ సస్యనామము • లెసఁగు సాంబ. 62

టీ. ఎల్లి, చుట్టావు, గొడుగు, ఎండమఱువు (గు) - ౪ ఛత్రము. టె క్యము, టెక్కెము, టెక్కెయము, సిడము, పడగ (ప్ర. పతాక.), డాలు - ౬ ధ్వజము. నిడివి, నిడుద, సోఁగ, నిడుపు, చాఁపు - ౫ దీర్ఘమైనది. మఱుఁగు, చాటు, ఓలము, మఱువు - ౪ మూఁత. జగతి, జగిలె, తిన్నె, అరుఁగు - ౪ వేదిక-తిన్నె. నేల, ఇల, పుడమి (ప్ర. పృథివి.), మన్ను, బువి (ప్ర. భువి.), పంటవలంతి = పంటలిచ్చు నాఁడుది - ౬ భూమి. విప్పు, వెడలుపు. రూ. వెడల్పు, విరివి. రూ. విఱివి, పఱపు, వెడఁద - ౫ వైశాల్యము. పైరు, ససి - ౨ సస్యము.

సీ. మోదు మొరడు మొద్దు • మోటన స్థాణు వౌ
బొఱియ కలుఁగు బొక్క • బొంద లోయ
యన బిలాఖ్యలు చెల్లు • నడుసు బురద జొంపి
యన లనఁ బంకాఖ్య • లెసఁగు మడుఁగు

మడు వన హ్రాద మొప్పుఁ ♦ బొడ వన నున్నతం
బగు గోడ యనఁగఁ గు♦డ్యంబు పొల్చు
సొరణగండ్లన ♦ మీఱు గవాక్షము
మాడుగుల్ మిద్దెలు ♦ మచ్చు లనఁగ
తే. దారునిర్మితగృహము లౌఁ ♦ దరకసంబు
బత్తళిక పొది దొన యనఁ ♦ బరఁగుఁ దూణి
పెట్టి మందసమును బెట్టె ♦ పెట్టియ యనఁ
బేటికాభిఖ్య లగు గుణ♦పేటి సాంబ. 63

టీ. మోడు, మొరడు, మొద్దు, మోటు-౪ స్థాణువు - కొమ్మలులేని చెట్టు. బొఱియ, కలుఁగు, బొక్క, బొంద, లోయ-౫ బిలము. అడుసు, బురద, ఆంపి, అసలు - ౪ పంకము. మడుఁగు, మడువు - ౨ హ్రదము. పొడవు-౧ ఉన్నతము. గోడ - ౧ కుడ్యము. సొరణగండ్లు-౧ గవాక్షము. మాడుగులు, మిద్దెలు, మచ్చులు-3 కొయ్యతోఁ గట్టినయిండ్లు. తరకసము, బత్తళిక, పొది, దొన - ౪ అమ్ములపొది. పెట్టి, మందసము, పెట్టె, పెట్టియ - ౪ పేటిక.

సీ. ఎన జోడు మాదిరి ♦ యీడు పురుడు మాద్రి
సాటి పాటి తరంబు ♦ దీటు దినుసు
సరి యుద్ది ప్రతి దిన్సు ♦ సవతు పోలిక దొర
జత యనఁగా సదృ♦శమున కెసఁగుఁ
బల్లకి పల్లకీ ♦ పాలకి పాల్కి నాఁ
బల్యంకికాఖ్యలు ♦ పరఁగు లాలి
యుయ్యాల యుయ్యెల ♦ యూయెల తొట్ల జో
ల యనంగ జోలి కా♦హ్వయము లెసఁగుఁ

తే. గంకటియు మంచ మనఁ జెల్లు ♦ ఖట్వమునకుఁ
పీఁట పలక యనఁగ నొప్పుఁ ♦ బీఠమునకు
బరణియుఁ గరాట మనుపేళ్లు ♦ భరణి కమరు
నిచ్చెన యనంగ నిశ్రేణి ♦ నెగడు సాంబ. 6

టీ. ఎన, జోడు, మాదిరి, ఈడు, పురుడు, మాత్ర, సాటి, పాటి తరము, దీటు, దినుసు, సరి, ఉద్ది, ప్రతి, దిన్సు, సవతు, పోలిక, దొర, జత. ౧౯ సమానములనుట. పల్లకి, పల్లకీ, పాలకి, పాల్కి – ౪ పల్లకి. ఉయ్యాల. రూ. ఊయాల - ఊయల. ఉయ్యేల. రూ. ఉయ్యెల–ఊయెల. ఊయెల. ఉయెల, తొట్ల, జోల – ౧౧ డోలిక. కంకటి, మంచము – ౨ ఖట్వము. పీఁట, పలక–౨ ఆసనము. బరణి, కరాటము —౨ కాటుక భరణి. నిచ్చెన – ౧ నిశ్రేణి – ఎక్కుసాధనము.

సీ. ఉలి యుక్కను మనఁగ ♦ నొనరు న[illegible]
చెంబు రాగి యనఁ దా♦మ్రం బెసంగుఁ
దగరము కరుగు డనఁగ సీసము రహించుఁ
గాంస్యంబు వర్తిల్లుఁ ♦ గంచనంగఁ
త్రపునాగ మనుముచు ♦ తగరము తగరి మనఁగఁ
గుండీలు చట్లు దగా♦కుప్పెబుడ్లు
కడవలు బానలు ♦ పెదకొల్ నెసల్లన
భాండములౌ నగు నాఁచు ♦ పాఁచి యనఁగ
తే. శైవలం బగు నూచులు ♦ బొప్పి యనఁగ
వెలయుఁ గాసారములు గుంట ♦ కొలను కొలఁకు
తిరుకొలఁ బను సరసికి ♦ బరఁగు వాఁక
యేఱు వంక వాఁ గనఁ బేరు ♦ దనరు సాంబ. 65

టీ. ఉలి. ఉక్కు, ఇనుము - 3 అయసు - లోహము. చెంబు (ఇది ద్రావిడము.), రాగి - 2 తామ్రమను లోహము. తగరము, కరుగుడు - 2 ...సము. కంచు - ౧ కాంస్యము. పి త్తళి, ఇత్తళి. రూ. ఇత్తడి - 3 త్రపు ను లోహము. * కుండ, చట్టి, మూఁకుడు, బుడ్డి, కడవ, బాన, పిడత, ...సరు - ౭ మంటికుండలలో భేదములు. నాఁచు, పాఁచి - 2 శైవాలము. ...ఁచితీఁగ. నూయి, బావి - 2. బావి. గుంట, కొలను, కొలఁకు, తిరుకొ ము (ఇది ద్రావిడపదము.) - ౪ సరస్సు. వాఁక, ఏఱు, వంక, వాఁగు - నది.

సీ. మీల్ మీలు చేఁపలు ♦ మీనులు తెఱగంట్లు
మచ్ఛము లనఁ జెల్లు ♦ మత్స్యములకుఁ
దాఁబేలు తామేలు ♦ నాఁ బొల్చుఁ గూర్మము
నెం డ్రెండ్రకా యన ♦ నెసఁగుఁ గర్కి
యోడ కల మనంగ ♦ నోనరు నావకు వాన
జడి ముసు రనఁగ వ♦ర్షమున కలరు
వానజాల్ వడగండ్లు ♦ నా నొప్పుఁ గరకలు
నిసు మన నిసు కన ♦ నిసు వనంగ

తే. మెఱయు సైకతనామముల్ ♦ కురుజుతేనె
పుట్టతేనియ పెరతేనె ♦ పువ్వుఁదేనె

* కుండ=సాధారణపాత్రము. చట్టి=నోరు వెడల్పుగానుండు గిన్నె ...టిపాత్రము. మూఁకుడు=మూత పెట్టెడిపాత్రము, బుడ్డి= నోరుసన్నగను ...డుపుగాను నుండు పాత్రము. కడవ = నీళ్ళు మొదలగునవి తోడుబిందె. ...న=నోరు చిన్నదిగను కడుపు పెద్దదిగాను నుండుకుండ, పిడత=చిన్నగిండి ...ంబువంటి పాత్ర, వెసరు=వండుటకుఁ దగినపాత్ర.

జుంటితేనియు యనఁ దగు ♦ సుమరసంబు
శంబధరనుతసుగుణక♦దంబసాంబ.

టీ. మీను (దీనికి బహువచనము మీలు, మీల్, మీనులు), చే
తెలగన్ను, మచ్చెము (ప్ర. మత్స్యము.) - ౪ మత్స్యము. తాఁబేలు,
మేలు - ౨ కూర్మము. ఎండ్రి, ఎండ్రకాయ - ౨ కర్కాటము.
కలము - ౨ నావ. వాన, జడి, ముసురు-౩ వర్షము. వానఱాలు, వడగం
౨వర్షోపలములు. ఇసుము, ఇసువు, ఇసుక - ౩ సికత. కురుజుతేనె,
తేనె, పెరతేనె, పువ్వుఁదేనె (పువ్వు+తేనె) =, పుష్పములయందలి
జుంటితేనె - ౫ మకరందము.

సీ. జముకాణము తివాసి ♦ జంబుకాణ మనంగఁ
గంబళాఖ్య లగు బం♦గారు హొన్ను
జాళువా పుత్తడి ♦ మేలిమి బంగరు
పసిఁడి పొన్ను కడాని ♦ పైఁడి యుదిరి
యన సువర్ణము వోల్చు ♦ నపరంజి కుందనం
బనఁ దప్తకనక మౌఁ ♦ దునుక తునియ
చిదురుప చిదురు నాఁ ♦ జెలఁగు ఖండమునకుఁ
బొది ప్రోగు వామియుఁ ♦ బోవు తిట్ట
తే. కుప్ప యన రాశి కగు సజ్జ ♦ యుప్పరిగయు
మహాలు మేడ యనంగ హా♦ర్మ్య మగుఁ దోవ
దారి తెన్ను తెరు వనఁ బ♦థంబు వెలయు
రవ రజం బన లవముపే ♦ ర్మిను సాంబ.

టీ. జముకాణము, తివాసి, జంబుకాణము- ౩ కంబళము. బంగా
హొన్ను, జాళువా, పుత్తడి, మేలిమి, బంగరు, పసిఁడి, పొన్ను, కడా

వేసినబంగారము. తునుక, తునియ, చిదురుప, చిదుర - ౪ ఖండము. పొది, పోఁగు, వామి, ప్రోవు, తిట్ట, కుప్ప-౬ రాశి. సజ్జ, ఉప్పరిగ, మహాలు (ఇది యన్యదేశ్యము.), మేడ - ౪ హర్మ్యము. త్రోవ, దారి, తెన్ను, తెరువు-౪ మార్గము. రవ, రజము—౨ కొంచెము.

సీ. అడవి కాన యనంగ ♦ నటవికిఁ దగు హజాను
తోఁట సింగారపుఁ♦దోఁట నంద
వన మనంగను నుప♦వన మొప్పు నడబావి
డిగ్గియ దొరు వన ♦ దీర్ఘిక తగుఁ
బవ్వళింపుబిడారు ♦ పడుకటి ల్లనఁ గేళి
గృహ మగు బోనపు♦టిల్లు వంట
యిల్లు సువారంపు♦టి ల్లన బాకమం
దిరము రాజిలు దగ♦తీర్పు చల్ల
తే. పంది లనఁ జలిపంది ల♦నం దనర్చు
సలిలశాలాభిధలు నీరు♦చల్ల నీరు
మజ్జిగయు జలతక్రనా♦మములు విసన
కఱ్ఱ వీవన యన వృంత♦క మగు సాంబ. 68

టీ. అడవి (ప్ర. అటవి.), కాన (ప్ర. కాననము.) - ౨అరణ్యము. హజానుతోఁట, సింగారపుఁదోఁట, నందవనము - ౩ ఉద్యానము. నడబావి, డిగ్గియ. రూ. డిగ్గె, దొరువు - ౩ దిగుడుబావి. పవ్వళింపుబిడారు, పడకటిల్లు (పడక + ఇల్లు)—౨ శయనగృహము. బోనపుటిల్లు (బోనము + ఇల్లు అన్నము పాకము చేయునట్టి యిల్లు, వంటయిల్లు, సువారంపుటిల్లు (సువారము + ఇల్లు)=వంటకై నయిల్లు - మహానసము - పాకశాల. దగతీర్పు, చల్ల పందిలి, చలిపందిలి - ౩ పానీయశాల. నీరుచల్ల, నీరుమజ్జిగ—౨ నీటితోఁ గూడిన మజ్జిగ. విసనకఱ్ఱ, వీవన - ౨తాళవృంతము.

క. భువి నీస్థావరవర్గము
నవరణ వ్రాసినను పనినఁ ♦ జదివిన యమ్మా
నవులను విద్యామతిశ్రీ
భవశాలురఁ గా నొనర్పు ♦ పశుపతి సాంబా.

తా. పుడమియందు ఈస్థావరవర్గను చక్కఁగా వ్రాసినవారును, వారును, చదివినవారును నీయనుగ్రహమువలన విద్య, మతి, కలిమిఁ గలవా రగునట్లు చేయుము.

స్థావరవర్గ సమాప్తము.

---

## తిర్యగ్వర్గ

క. శ్రీగౌరీపతి నీపై
బా గౌరీతి రచియింతుఁ ♦ బటుకవితాధా
రాగతిఁ దిర్యగ్వర్గము
వేగమె నిగిడించి ప్రోవ♦వే శ్రీసాంబా.

తా. కాంతియుతుఁడవయిన ఓ గౌరీనాయకా! నీకంకితముగా చక్కశైలిని దిట్టమైన కవిత్వధార మెఱయఁ దిర్యగ్వర్గను వేగిరముగా రచియిందను, దానిని వేగిరముగాఁ గొనసాగించి కాపాడుము.

సీ. నెఱసరి సింగంబు ♦ తెఱఁగొము నొకంబు
మెకములదొర జడ♦నొకము బొబ్బ
మెకము వెడఁదనోటి♦నొకము గుబ్బలిపట్టి
గుఱ్ఱు మేనుంగులఁ♦గొంగ యనఁగఁ
జెలఁగు సింహాము పేళ్లు ♦ పులి చాఱలమెకంబు

మువ్వన్నె మెక మనఁ • బొలుపొందు వ్యాఘ్రంబు
వావురము పటాణి వారువంబు

తే. జక్కి మావు గుఱ్ఱము తేజి • యెక్కిరింత
తత్తడి రవాలు నడగుఁడు • కత్తలాని
తురికి బాబా యనఁగ నొప్పు • దురగమునకుఁ
గొమ్మనఁగఁ దనమేరు శృం•గమ్ము సాంబ.

టీ. కేసరి=శౌర్యముగలది, సింగము (ప్ర. సింహము.) తెల్లమొగము మెకము=విరివి మోముగల మృగము, మెకములదొర=మృగరాజు, జడమెకము=కేసరములుగలది, బొబ్బమెకము=గొప్పనాదము చేయుమృగము, వెడదనోటిమెకము=విశాలముఖము గలమృగము, గుబ్బలిపట్టిగుఱ్ఱము = పర్వతపుత్త్రికి (పార్వతికి) వాహనము, ఏనుఁగులగొంగ=గజశత్రువు-౯ సింహము. పులి, చాఱలమెకము=గీఁతలుగలమృగము, తెరువుగాఁపరి=మార్గమునఁగాచి యుండునది, పసితిండిపోతు= పసులను భక్షించునది, మువ్వన్నెమెకము=మూఁడువర్ణములు (నలుపు, తెలుపు, పసుపు) గల మృగము - ౫వ్యాఘ్రము. వావురము, పటాణి, వారువము. రూ. వార్వము, జక్కి, మావు, గుఱ్ఱము, తేజి. రూ. తేజీ, ఎక్కిరింత.రూ. ఎకిరింత, తత్తడి, రవాలు, నడగుఁడు, కత్తలాని. పా. కత్తళుఁడు, తురికి, బాబా - ౧౨ అశ్వము. కొమ్ము - ౧ శృంగము.

సీ. సిబ్బెమేనిమెకంబు • గబ్బుచెంపమెకంబు
గొప్పయజ్జమెక మె•క్కుడుమెకంబు
గొరు చెయ్యిగలమె•కము రెండుత్రాగు డే
నుఁగు పలుగొమ్ములు • దగినమెకము
హత్తి బత్తలమెకం • బన దంతిపేళ్లగుఁ
బుట్టకూటిమెకంబు • బొచ్చుమెకము

వెనుచూపుమెక మెల్లు • వెలినోటిమెక మన
భల్లూకనామముల్ • పరఁగు గొరిజ
తే. గొరిసె యన ఖుర మమరును • గోరనంగ
నఖము తగు జోడనలు రవ•నడలు నడ్డ
వేడెములు పర్వు లనఁ జుట్టు•వేడెము లనఁ
బంచధారలనామముల్ • పరఁగు సాంబ. 72

టీ. సిబ్బెమేని మెకము=పొడలుగల మేనితోఁగూడినమృగము, గబ్బు చెంపమెకము = మదగంధముగలమృగము, గొప్పయజ్జమెకము=పెద్దపాదములు గలమృగము, ఎక్కుడు మెకము-రాజులెక్కెడిమృగము-గొఱ్ఱ, చెయ్యి గలమెకము=తొండముగలమృగము, రెండుత్రాగుడు = రెండుమాఱులుత్రాగునది, ద్విపము, ఏనుఁగు. రూ. ఏనిక, పలుగొమ్ములు దగిన మెకము= పండ్లకొమ్ములుఁగాగల మృగము, హత్తి (ప్రా. హస్తి.), బత్తలమెకము=గొప్పతలగలమృగము -౧౩ గజము. పుట్టకూటిమెకము = పుట్టకూటిని (చీమగుడ్లతోఁగూడిన పుట్టమంటిని) దినుమృగము, బొచ్చుమెకము=ఒడలినిండుగవెండ్రుకలుగల మృగము, వెనుకచూపు మెకము - ఎల్గు, వెలినోటిమెకము - ౫ ఎలుఁగు గొడ్డు. గొరిజ, గొరిసె- ౨ గిట్ట-ఖురము. గోరు-నఖము, జోడనలు =ధౌరితకములు, రవనడలు = ఆస్కందితములు, అడ్డవేడెములు= రేచితము, పర్వులు,=ప్లుతములు, చుట్టువేడెములు =వల్గితములు - ౫ గుఱ్ఱముయొక్క నడకభేదములు.

సీ. పసి గిడ్డి మొదవావు • పసరము తొడు కనఁ
బశువుపేళ్లగు గిబ్బ • బసవఁ డాల
పోతు నాఁబోతు మూఁ•పురముఁడాల్పెద్దు ము
క్కంటిమావన వృషా•ఖ్యలు దనర్చుఁ
గోడె గిత్త యనంగఁ • గొఱలు నుక్షాఖ్యలు
కేవు పడ్డయు దూడ • లేఁగ పెయ్య

యన వత్సనామంబు ♦ లలరును నెనుపెంటి
బఱ్ఱె నా మహిషికిఁ ♦ బరఁగు దుంత
తే. దున్న పోతన మహిషము ♦ దొడ్డి తొట్టు
పట్టు లనఁగ గోస్థానముల్ ♦ పరఁగు మంద
కదుపు పదు వనఁ జెలఁగు గో♦గణము పాగ
లాయ మన నొప్పు వాజిశా♦లకును సాంబ. 73

టీ. పసి, గిడ్డి, మొదవు, ఆవు, పసరము, తొడుకు-౬ పశువు. గిబ్బ, బసవఁడు, ఆలపోతు, ఆఁబోతు, వృషపురము దాల్పు, ఎద్దు, ముక్కంటివాహు = శివునివాహనమైనది - ౭ వృషభము. కోడె, గిత్త - ౨ చిన్నయెద్దు-ఉక్షము. క్రేపు, పడ్డ, దూడ, లేఁగ, పెయ్య-౫ ఆవుదూడ-వత్సము. ఎనుపెంటి (ఎనుము + పెంటి), బఱ్ఱె-౨ మహిషి-గేదె. దుంత, దున్న, పోతు-౩ మహిషము. దొడ్డి, తొట్టుపట్టు-౨ పసులకొట్టము. మంద, కదుపు, పదువు-౩ ఆవులగుంపు. పాగ, పా. పాగా, లాయము - ౩ అశ్వశాల.

సీ. సింగంబుగొంగ ద♦చ్చియుమగు-మెక మ
నఁగ శరభాఖ్య లొఁ ♦ దగరు జంట
మొగము వేలుపు తేజి ♦ పొట్టేలు గొఱియపో
తేడిక యన మేష ♦ మెసఁగు నిఱ్ఱి
నులికొమ్ముమెక మన ♦ వెలయుఁ గృష్ణమృగంబు
జింక లేడన మృగి ♦ చెలఁగుఁ బిల్లి
పిల్లి యనంగ మా♦ర్జాల మౌఁ గుందేలు
చెవులపో తనఁగ రం♦జిలు శశంబు
తే. నొంచె లొట్టిపిట్ట యనఁగ ♦ నుష్ట్రి మమరుఁ
గణితి కణఁ జనఁ దనరు గో♦కర్ణమృగము

పిక్కమెక నెండ్రిమేఁతరి ♦ నక్క బుద్ధి
మెక మనఁగఁ జంబుకాఖ్యలు ♦ మెఱయు సాంబ. 7

టీ. సింగపుఁగొంగ=సింహమునకువిరోధి, దచ్చియడుగుల మెకము = ఎనిమిదికాళ్లమృగము—౧ శరభమృగము. తగరు,జంటమొగము వేలుపు తేజీ= రెండుముఖములుగల వేల్పునకు(అగ్నికి)వాహనము,పొట్టేలు, గొఱియపోతు రూ. గొఱ్ఱెపోతు. ఏడిక - ౫ మేషము. ఇఱ్ఱి, నులికొమ్ము మెకము=మెలికలు దిరిగినకొమ్ములు గలమృగము - ౩ కృష్ణమృగము, జింక, లేఁడి. రూ. లేటి.౩ ఆఁడుజింక. [illegible], [illegible]—౧ మార్జాలము. కుందేలు, చెవులపోతు ౧ శశము. ఒంటె. రూ. ఒంటెము. లొట్టిపిట్ట.రూ.లొట్టిపిట-లొటిపిట్ట లొటిపిట పా. లొట్టియ-లొట్టె లొట్టెనుఁగు-౬ ఉష్ట్రము. కణితి రూ. కడితి. కణుఁజు.రూ. కడుఁజు-౪ గోకర్ణమృగము. పిక్కమెకము = పంచ చేయుమృగము, ఎండ్రి మేఁతరి= ఎండ్రకాయలను దినునది, నక్క, బుద్ధిమెకము ౪ జంబుకము.

సీ. కొమ్మెక్కెడిమెకంబు ♦ తిక్కఁడు వెకిరింత
కోఁతి నాఁగపిచెల్లు ♦ కొఱలుచుండు
జల్లితోఁకమెకంబు ♦ సవరంపుమెక మనఁ
జమరికిం జనుఁ బంది ♦ చప్పరింత
కొమ్ముకాఁడూటమెకము వేఁపులమిత్తి
ముస్తెలమేపరి ♦ మోటుమెకము
వాలుమెకంబు రో♦బంటరి యొంటరి
ముట్టెమెకము పీఁట♦వెట్టుమెకము
తే. ఏకలము గుఱ్ఱురింత ♦ నెసఁగు దంష్ట్రి
పొదమెకము దుప్పియనఁ బొలు♦పడరు రామ
మృగము మనుఁబోతనఁగ ఋశ్య♦మృగము దనరు
బల్లి గౌళిన ముసలికిఁ ♦ బరఁగు సాంబ. 7

టీ. కొమ్మ తెంకి మెకము=చెట్లకొమ్మలె యునికిపట్టుగాఁగల మృగము-శాఖామృగము. తిమ్మఁడు, వెకిరింత=తన్నెచ్చరించువారిని వెక్కిరించునది, కోఁతి.రూ. క్రోఁతి-౫ వానరము. జల్లితోఁక మెకము=పలుచని వెండ్రుకలు తోఁకయందుఁగలమృగము, సవరంపు మెకము = సవరములకైనమృగము-౧ చమరమృగము. పంది, చప్పరింత=చప్పరించితినునది, కొమ్ముకాఁడు=కొమ్ముగలది, ఊటమెకము=దృఢమైనమృగము, వేఁపులమిత్తి=కుక్కలకుశత్రువు, ముస్తెలమేఁపరి=తుంగగడ్డలనుదినునది, మోటుమెకము=*మోటుపయోగింపఁబడుమృగము, వాలుమెకము=క్రూరమైనమృగము. రోఁబంటరి, ఒంటరి, ముట్టె మెకము-ముట్టెగలమృగము, పీఁటవెట్టు మెకము=పల్లము త్రవ్వికూర్చుండుమృగము. ఏకలము, గుర్గురింత=గుఱగుఱయని చప్పుడుచేయునది-౧౪ అడవి పంది-వరాహము. పొడ మెకము, దుప్పి-౨ రామమృగము. మనుఁబోతు-౧ ఋశ్యమృగము. బల్లి, గౌళి-౨ బల్లి.

సీ. తోఁడేలు గోటియల♦సూఁడన వృక మొప్పు
ముంగిస వెంట్రువ ♦ ముంగి యనఁగ
బభ్రువు తగుఁ గొక్కు ♦ పందికొక్కన మూషి
కకుఁ బొల్చు గాడిద ♦ గాలిగాఁడు
చలువగుఱ్ఱము తేవు♦జక్కి యన ఖరాఖ్య
లగు మొఱుఁగుడు జాగి♦లమ్ము గుక్క
వేపి నా శునకంబు ♦ వెలయును దొండ యూ
సరవెల్లి యనఁ దగు ♦ సరటమునకుఁ
తే. జిట్టెలుక యన బాలమూ♦షికకుఁ బొల్చు
నుడుము తేళ్లమేపరి యన ♦ నొనరు చుండు

---

* మోటు-అనఁగా పందికెదుట మనుష్యాకారముగా నిలిపిన కపట లక్ష్యము.

నవని గౌధేరనామధే • యములు మహిత
సకలసురచక్రవర్తి శ్రీ • సాంబమూర్తి. 7

టీ. తొండేలు, గొఱియలనూడు=గొఱ్ఱెలకు శత్రువు-౨ వ్రకమ
ముంగిస, వెంట్రువ, ముంగి - 3 నకులము. కొక్కు, పందికొక్కు-౨ మ
షికము. గాడిద, గాలిగాడు, చలువగుఱ్ఱము=చాకలి చలువచేసినబట్టల
మోయువాహనము, రేవుజక్కి=చాకిరేవునందుండు- గుఱ్ఱము-౫ ఖరమ
మొఱుగుడు, జాగిలము, కుక్క, వేపి - ౪ శునకము. తొండ, ఊస
వెల్లి-౨ సరట. చిట్టెలుక (చిఱు + ఎలుక)=చిన్నఎలుక-౧చుంచు. ఉడుమ
తేళ్లమేపరి-౨ ఉసుము-గౌధేరము.

సీ. తంతువాయ మగుఁ బా • దట్టుపురుగు సన్న
పిల్లి సాలీఁడన • రాళ్ల రాసి
గాఁడు గరిమిడియె • ల్క యన నాఖువు దగు
నెలుకలు చట్టుపల్ • గఱులు ఱెక్క
లఁన బక్షములు పొల్చు • లావు లీఁక లనంగఁ
బర్ణంబు తగు గువ్వ • పక్కి పిట్ట
పులుఁ గనఁ బక్షికి • వెలయు మదికొలంకు
పులుఁగు తెల్లనిపిట్ట • నలువ తేజి
తే. పాలు నీరును వెలిసేయు • పక్కి యంచ
యన మరాళంబు తగుఁ గెంపు • కనులపుల్లు
తలిరుమేఁతరి సాఁకుడు • పులుఁగు మావి
కొమ్మయిలుపుల్లు కోవెల • కోయి లనఁగఁ
బరభృతమునామధేయముల్ • పరఁగుసాంబ. 7

టీ. పాదట్టుపురుగు. రూ. పాదొట్టుపురుగు=ఇండ్లలోపలి వాసవ
లకు పట్టెలకు పట్టెడుబూసిని గలిగించుపురుగు, సన్నపిల్లి, సాలీఁడు-

హాలెపురుగు. ఱాళ్లరాసిగాఁడు, గరిమిడియొలుక-౨ గొప్పయొలుక. ఎఱ
కలు, చట్టుపలు, గఱులు, ఱెక్కలు-౪ పక్షములు. లావులు, ఈఁకలు-
౨ ఈఁకలు-పర్ణములు. గువ్వ,పక్కి (ప్ర. పక్షి), పిట్ట, పులుఁగు-౪పక్షి.
మదికొలంకుపులుఁగు = మానససరస్సునందలిపక్షి, తెల్లనిపిట్ట=తెల్లవర్ణము
గలపక్షి, నలువతేజి=బ్రహ్మవాహనము, పాలునీరునువెలిసేయుపక్కి,అంచ-
౫ హంసము. కెంపుకనులపుల్గు=ఎఱ్ఱనికన్నులుగలపిట్ట, తలిరుమేఁతరి=చిగు
ళ్లు తినునది, సాఁకుడుపులుఁగు=ఇతరులచే-(కాకులచే) సాఁకఁబడుపక్షి-పర
భృతము. మావి...పుల్గు = మామిడికొమ్మయందు వసించుపిట్ట, కోవెల,
కోయిల-౬ కోకిలపక్షి.

సీ. పచ్చఱెక్కలపుల్గు • పచ్చవిల్తుని తేజి
పలుకులపులుఁగు నాఁ • జిలుక చిల్క-
యనఁగ శుకాభిఖ్య • లగు బట్టికాఁడు గో
ర్వంక గోరింక గో•రంక యనఁగ
శారికాహ్వయము లె•సంగు నట్టువపిట్ట
నెమ్మి జుట్టుఁబులుఁగు • నెమిలి నమిలి
పురివిప్పియాడెడి•పులుఁగు కన్నులుగల
పులుఁగన బర్హికి • వెలయుచుండు
తే. జంటపిట్ట బటువుగువ్వ • జక్కవ యనఁ
గోకనామంబు లగు మంచు•గ్రోలుపుల్గు
నిప్పులనుమ్రింగుపులుఁగు వె•న్నెలపులుఁగన
నమరును జకోరనామధే•యములు సాంబ. 78

టీ. పచ్చఱెక్కలపులుఁగు=ఆకుపచ్చనిఱెక్కలుగలపిట్ట,పచ్చవిల్తు
ని తేజి=మన్మథునివాహనము, పలుకులపులుఁగు = మాటాడుపక్షి, చిలుక,
చిల్క-౫ శుకము. బట్టికాఁడు, గోర్వంక. రూ. గోరువంక, గోరింక, గో
రంక-౪ శారిక. నట్టువపిట్ట = నాట్యమాడుపక్షి, నెమ్మి, జుట్టుఁబులుఁగు=

జొట్టుగలపక్షి-శిఖి, నెమిలి.రూ. నెమలి,నమిలి, పురివిప్పియాడెడిపులుఁ
పింఛము విచ్చియాడుపక్షి,కన్నులు గలపులుఁగు=నయనమువంటివి యాః
గల పురిగలపక్షి-రా మయూరము. జంటపిట్ట = ఆలుమగలు గలిసియుఁ
పక్షి,బటువుగువ్వ=గుండ్రనిపక్షి, జక్కవ-వి చక్రవాకము. మంచుగో
పులుఁగు=మంచు పానము చేయుపక్షి. నిప్పులను మ్రింగుపులుఁగు, వె
పులుగుఁ-వి చకోరపక్షి.

సీ. విరితేనెత్రావుడు • మరునల్లె బమిపుర్వు
తుమ్మెద తేఁటి ము•ద్దుగలకాళ్ల
పురు గన భ్రమరంబు • పొలుచు లకోరీలు
బకదారు లొడ్డీలు • పల్లటీలు
పావురములు నేల•పల్లటీల్ కూకీలు
పావురా లంతర•పల్లటీలు
సురటీ లనంగఁ బొ•ల్చును గలరవములు
కొక్కెర క్రౌంచయుఁ • గొక్కరాయి
తే. యనఁగ క్రౌంచాఖ్య లగుఁ గొంగ • యన బకంబు
జాలె జలకట్టె యణుజు వే•సడము లగుడు
జావడము వారణము బైరి • సాళువంబు
కని సెరము చెంచడము డేగ • యనఁగఁ దనరు
శ్యేనమునకు మునీశ్వరా•ధిన సాంబ.

టీ. విరితేనెత్రావుడు=పూవుల తేనెను పానము చేయునది, మరునల్లె
మన్మథునికల్లెత్రాటివంటిది, బమిపుర్వు, తుమ్మెద, తేఁటి, ముద్దుగలకాళ్లు
రుగు=మూఁడుజఁటల (ఆఱు) కాళ్లపురుగు - షట్పదము-ఉ భ్రమరము
లకోరీలు,బకదారులు, ఒడ్డీలు,పల్లటీలు,పావురములు, నేలపల్లటీలు, కూకీలు

గావురాలు, అంతరపల్లటీలు, సురటీలు-౧౦ కపోతములు. కొక్కెర,క్రౌంచ కొక్కెరాయి-౩ క్రౌంచపక్షి. కొంగ-౧ బకము. జాలె.రూ. జాలియ, జల ట్టై. రూ. జలకట్టియ.పా. సెలకట్టె, అణుజు. రూ. అడుజు, వేసడము, గుడు, జాపడము, వారణము, బైరి. రూ. బయిరి. సాళువము. రూ. గాళ్వము, కనిసెరము, చెంచడము, డేగ-౧౭ శ్యేనభేదములు.

). కరువలిమేఁతరి • కంటివిన్కరి పాము
పుట్టకాఁపరి త్రాఁచు • చుట్టుపురుఁగు
విసముతాలుపు చిల్వ • బుసపుర్వు నా భోగి
వెలయుఁ జిలువఱేఁడు • వెన్ను పాన్పు
తడవులనిడుపఁడు • తరిగట్టుత్రాఁడన
నహిపతి కగు నజ్జ•యలుఁగుపులుఁగు
కోడి పుంజన నొప్పుఁ • గుక్కుటనామముల్
గుడ్లగూబ పగటి•గ్రుడ్డి గూబ
తే. యనఁగ ఘూకాభిధానంబు • లగు లకుముకి
మీనవల్లంకి పొదలిక • మీలగొంగ
యనఁగఁ జను నర్తితకుఁ బేరు • లమరు దివ్వె
యార్పు మిడుత శలభాఖ్య • లమరు సాంబ. 80

టీ. కరువలిమేఁతరి = గాలిని భక్షించునది, కంటివిన్కరి=చక్షుశ్శ్రవము, పాము, పుట్టకాఁపరి=పుట్టయందు వాసము చేయునది,త్రాఁచు, చుట్టుపులుగు = చుట్టుకొని యుండుకీటము, విసముతాలుపు=విషము ధరించునది, చిల్వ.రూ.చిలువ, బుసపుర్వు = బుసకొట్టుపురుగు-౧౦ పాము - సర్పము. చిలువఱేఁడు = పాములకు ఱేఁడు, వెన్నుపాన్పు=విష్ణువునకు శయనమైన వాఁడు,తడవులనిడుపఁడు=చిరకాలము జీవించియుండువాఁడు, తరిగట్టుత్రాఁడు=మంథరపర్వతమునకుఁ గవ్వపుఁద్రాడయినది -౪ ఆదిశేషుఁడు. అజ్జయ

అంగుపులుంగు = చరణాయుధము, కోడి, పుంజు - 3 కుక్కుటము. గుగూబ, పగటి గ్రుడ్డి=దివాంధము, గూబ-3 ఘూకము. లకుముకి, మీనపల్లకి, పాదలిక, మీలగొంగ = చేపలకువైరి - 3 పిచ్చుక. దివ్వెయార్చు దీపము చల్లార్చునది, మిడుత-౧ శలభము.

సీ. కాటుకపిట్ట కూఁ♦కటిగువ్వ యేట్రింత
పులుఁగులదుమురి ♦ పోలిగాఁడు
నాఁగ భరద్వాజ♦నామముల్ తగు గబ్బి
లము గబ్బిడా గబ్బి♦లాయి చీకు
రా యనంగనుఁ దైల♦పాయి కాఖ్యలు చెల్లు
మ్రానుదొలుచుపిట్ట ♦ మ్రానుపోటు
వనఁగ దార్వాఘాట♦మున కగు బెగ్గుర
మన సారసమ్మున ♦ కలరు నీరు
తే. కట్టె నీరుపా మన నల♦గర్ద మలరుఁ
బుడమిచెవి పాములబిడారు ♦ పుట్ట యనఁగ
మించు వల్మీకనామముల్ ♦ మెట్టు తాప
మెట్టిక యన సోపానాఖ్య ♦ మెఱయు సాంబ. 8

టీ. కాటుకపిట్ట, కూఁకటిగువ్వ, ఏట్రింత. పులుఁగులదుమరి=పక్షులను సంహరించునది. పోలిగాఁడు. రూ. పోలఁడు-౬ భరద్వాజపక్షి. గబ్బిలము. రూ. గబ్బిడము, గబ్బిడా. రూ. గబ్బిలా, గబ్బిడాయి. రూ. గబ్బిలాయి, చీకురా. రూ. చీకురువాయి - ౮ తైలపాయిక. మ్రానుదొలుచుపిట్ట, మ్రానుపోటువు-౨ పత్త్రంగిపిట్ట. బెగ్గురము-౧ సారసపక్షి. నీరుకట్టె నీరుపాము-౨ నీటిలో వసించుపాము - అలగర్దము. పుడమిచెవి=భూమికర్ణము, పాములబిడారు=సర్పగృహము, పుట్ట-3 వల్మీకము. మెట్టు తాప, మెట్టిక. రూ. మెటిక-3 సోపానము.

సీ. గుమికాఁడు కాకి నాఁ • గొఱలుఁ గాకము పేళ్లు
గ్రద్ద యనంగ గృ • ధ్రంబు వెలయు
జరగు గుబ్బిలికాఁడు • సకినాలు వెలయించు
పక్కి-పగటిచీకు • పైఁడికంటి
యనఁ గనకాక్షికి • దనరు జవాది జ
వ్వాజి యనఁగ సాంక • వము దనర్చు
కస్తూరి వీణెయుఁ • గస్తురి యనఁ బొల్చు
మృగనాభి చట్టుపు • మెకము పునుఁగుఁ
తే. బిల్లి యొత్తైడుపిల్లి నాఁ • బేళ్ళు వెలయు
గంధిలమునకుఁ జాతకా • ఖ్యలు దనర్చు
వానకోయిల మబ్బునీ • రానుపిట్ట
యనఁగఁ గైలాసశైలవి • హార సాంబ. 82

టీ. గుమికాఁడు=కూటముచేర్చునది, కాకి - ౨ వాయసము. గ్రద్ద. రూ. గద్ద - ౧ గృధ్రము. గుబ్బిలికాఁడు. రూ. గుబ్బిలి, సకినాలు... పక్కి=శకునములను దెలుపుపక్షి, పగటి-చీకు=పగలుకన్నులు దెలియనిది, పైఁడికంటి=బంగరువంటికన్నులుగలది - ౫ కనకాక్షి, జవాది. రూ. జవ్వాది - జవ్వాదు, జవ్వాజి. రూ. జవాజి - ౫ సంకుమదము-ఒకసుగంధద్రవ్యము. కస్తూరి, వీణె. రూ. వీణియ, కస్తురి-౪ మృగమదము-ఒకదినును సుగంధద్రవ్యము. చట్టుపుమెకము-పునుఁగుచట్టముగల మృగము, పునుఁగుఁబిల్లి (పునుఁగు+పిల్లి), ఒత్తైడుపిల్లి-౩ ఒకజాతిపిల్లి. వానకోయిల, మబ్బునీరానుపిట్ట=మేఘజలమును ద్రావెడుపక్షి -౨ చాతకపక్షి.

సీ. పొడకోడి కానపుం • జడవిపుం జన వన
కుక్కుటం బగు బొల్లి • కోడి నీరు

కోడి యనఁగ జల • కుక్కుటంబు దలిర్చు
పిట్టపిచ్చిక యూరఁ • బిచ్చిక యనఁ
దగుఁ జటకమున కౌ • దాఁటరి చలికావు
కప్ప మనఁగ భేక • మొప్పు జలగ
నల్లత్రాగు డన రాఁ • జిల్లు జలూకము
మొగటిపురువు గోడ • పురువు నల్లి

తే. నాఁగ మత్కుణ మగు నీవ • యీఁగ యనఁగ
మక్షికకు నొప్పు ములుపుర్వు • మంటితిండి
తే లనఁగ వృశ్చికంబు వ • ర్తిల్లు జొచ్చు
పురుగు దోమన మశకంబు • పరఁగు సాంబ. 83

టీ. పొదకోడి, కానపుంజు, అడవిపుంజు — ౩ వనకుక్కుటము. బొల్లికోడి, నీరుకోడి — ౨ నీటియందు వసించుకుక్కుటము. పిట్ట, పిచ్చిక, ఊరఁబిచ్చిక (ఊరణ్ + పిచ్చిక) — ౩ ఒకదినుసుపిట్ట — చటకము. దాఁటరి=దుముకునది, చలికావు=వర్షాకాలమునఁ జలికిఁ బుట్టునది, కప్ప — ౩ మండూకము. జలగ, నల్లత్రాగుడు=రక్తపానము చేయునది — ౨ జలూకము. మొగటిపురువు, గోడపురువు = గోడయందుఁ బ్రాఁకునట్టిపురుగు, నల్లి — ౩ మత్కుణము. ఈఁగ. ఈవ — ౨ మక్షిక. ములుపుర్వు = కొండిగలపురుగు, మంటితిండి= మన్ను భక్షించునది, తేలు — ౩ వృశ్చికము. జొచ్చుపురుగు=అడుసుమీఁద వాలుపురుగు. దోమ — ౨ మశకము.

క. ప్రీతిని భవదంకిత మౌ
నీతిర్యగ్వర్గు జగము • లెన్నఁగ లోకా
తీతం బై పూతం బై
ఖ్యాతం బై ధరను వెలయుఁ • గావుత సాంబా. 84

తా. ఓ సాంబమూర్తీ! నేను భక్తితో నీకంకితముగా నొనర్చిన యీ ...ర్గ్వర్గు లోకులందఱు గొనియాడునట్లు మిక్కిలి ప్రసిద్ధమయి పావనమై ...కాతీతమై పుడమియందు వెలుఁగును గాక.

తిర్యగ్వర్గుసమాప్తము.

---

## నా నా ర్థ వ ర్గు.

క. శ్రీనాయకసాయక వా
ణీనాయకముఖ్యవినుత • నీపేరిట నే
నానార్థవర్గుఁ జేసెద
నానార్థము లొసఁగి ప్రోపు • నను గృప సాంబా. 85

తా. త్రిపురసంహారసమయంబున విష్ణువును దూపునుగాఁ జేసికొన్న ...ఁడా! బ్రహ్మాదిదేవతలచేఁ బొగడఁబడువాఁడా! నీకంకితముగా నానార్థ ...ను రచించెదను. నీవు నా కన్నిసంపదల నొసఁగి కాపాడుము.

సీ. గుణమున కాటుకుఁ • గోవు నా విలసిల్లు
గోతికి శాఖ కాఁ • గొమ్మ యనఁగ
శకలంబునకును మాటకు బలు కన మించు
నినుపును గోవు నాఁ • బసి యనంగఁ
గణికిఁ బైపూరికిఁ • గప్పనఁ జెన్నొందుఁ
గొఱ్ఱికుఁ గడమ కాఁ • గొఱఁత యనఁగ
మగగుజ్జమునకు గుల్మమున కా గుండన
నెలకు జాబిల్లి కా • నెల యనంగ
తే. నూటకును జేవకుఁ దనర్చు • నూట యనఁగ
వేఁడుటకుఁ గాఁకకుఁ దలిర్చు • వేఁడి యనఁగ

నంకమునకు బిడ్డకును గం • దనఁగఁ బరఁగు
లలితమునిమానసాబ్జరో•లంబ సాంబ. 86

టీ. 1 కోపు=అల్లెత్రాడు, ఆట. 2 కొమ్మ=ఆఁడుది, చెట్టుకొమ్మ. 3 పలుకు=తునుక, మాట. 4 పసి=బాలుఁడు, పసరము. 5 కప్పు = నల్లన, ఇంటిపైకప్పు. 6 కొఱఁత=కొఱ్ఱు, తక్కువ. 7 గుండు=మగజొత్తిము, గుల్లము. 8 నెల=మాసము, (30 దినములు.) చంద్రుఁడు. 9 ఊటు = బలము, నీటి యూట. 10 వేఁడి (వేఁడుధాతువు-క్త్వార్థకము) = వేఁడుకొని యనుట, ఉష్ణము. 11 కందు=కళంకము, బిడ్డఁడు.

సీ. ఈఁతచెట్టును లోఁతు • నీఁత యనఁ జెలంగు
నడుగుఁ గ్రింది కౌ • నడు గనంగ
మాలిమికి నడత కి • మ్మగు నలవా టన
నమ్మకు నవ్వ కౌ • నవ్వ యనఁగ
గోడుగును మఱునాఁడు • నలరు నెల్లి యనంగ
నెత్తురుకుఁ దిండి కౌ • నెర యనంగ
విరికి నొప్పౌటకును • వెలయు నల రనంగఁ
బేరును దండ రాఁ • బే రనంగఁ

తే. నది యనుటకు భంగమున కౌ • నల యనంగ
నాత్రమునకు వృత్తమున కౌ • నక్కఱ యన
నాలమునకుఁ బలుకుట కౌ • నని యనంగ
నంబరధునీలసజ్జటా•డంబ సాంబ. 87

టీ. 1 ఈఁత=ఈఁతచెట్టు (ఇదిసమాసపదముయొక్కయొక భాగము, దీనికి ప్రాతిపదికము.), నీటియందుఈఁదుట. 2 అడుగు=పాదము, క్రిందిభాగము. 3 అలవాటు=మాలిమి, స్వభావము. 3 అవ్వ=తల్లి, తాతతల్లి, తల్లితల్లి.

5 ఎల్లి = గొడుగు, మఱునాఁడు - రేపు అనుట. 6 ఎఱ (శకటరేఫము)= ఎఱుపు, ఎర (లఘురేఫము)=ఆహారము. 7 అలరు=పుష్పము (నామము.), ఒప్పు (క్రియ.). 8 పేరు=దండ, నామధేయము. 9 అల=ఆయనుట(విణ), తరంగము. 10 అక్కఱ=ఆత్రము (అలఘురేఫము), అక్కర యను నొక వృత్తము (లఘురేఫము.). 11 అని=(అనుధాతువు క్త్వార్థకము. అవ్య.) చెప్పి యనుట, యుద్ధము నామము.)

సీ. ములికికిఁ జెఱువుకో♦పునకు న ల్లనఁ బొల్చు
నైదును దాను నే♦ నన రహించుఁ
జెవిసొమ్మునకును దం♦తువుకుఁ బోఁ గనఁ జెల్లుఁ
బురిటికి సాటికిఁ ♦ బురు డనఁ దగు
నడవికిఁ జూడమి ♦ కగుఁ గాన యనఁ బొల్చు
గల్లును ఱాయియుఁ ♦ గ ల్లనంగఁ
గంచుకొమ్మునకు శృం♦గమున కొఁ గొ మ్మనఁ
బాఁచికి దొంగ కొ ♦ నాఁ చనంగఁ
తే. గరువలికి దయ్యమునకు నొ ♦ గాలి యనఁగ
ఘటికయును దల్పుమల్కు నొ ♦ గడియ యనఁగ
నూటికిని మర్దనమున కొ ♦ నూ అనంగఁ
జటులదైతేయమదశైల ♦ శంబ సాంబ. 88

టీ. 1 అల్లు. రూ. అలుఁగు = బాణము, చెఱువుకట్టయొక్క కొన భాగము. 2 ఏను = ఐదు, 'నేను' అనుదానికి రూపాంతరము. 3 పోఁగు= కర్ణభూషణము, దారము. 4 పురుడు=ఆశౌచము (జాతము.), సమానము. 5 కాన=అడవి, కనుధాతువు తుమున్నర్థకము (చూచుటకు అనుట). 6 కల్లు= ఱాయి, మద్యము. 7 కొమ్ము=కంచుతోఁ జేయఁబడిన యొకవాద్యవిశేషము, శృంగము 8 నాఁచు=పాఁచి,దొంగ. 9 గాలి=గాడ్పు, దయ్యము. 10 గడి

యు=ఘటిక (24 నిమిషముల కాలము), తలుపుగొళ్లెము. 11 నూఱు = పది పదులు (నామము., బండమీఁద నొకవస్తువును రాచుట.

సీ. కడుపుగడ్డయుఁ దూము • నడరు బల్ల యనంగ
విఱివికి శయ్య కౌఁ • బఱ పనంగఁ
గౌముదికిని మ్రొక్కు • కగు వెన్నెల యనంగఁ
బగలును గంటు నౌఁ • బగ లనంగ
నంగళ్ళ నొకపోఁగు • నగును బేఁట యనఁగ
నెమలికి మైత్రి కౌ • నెమ్మి యనఁగఁ
బసుపుతావికి వీథి • కెనఁగు వాడ యనఁగఁ
జలికిని గాలి కౌ • వలి యనంగఁ

తే. బట్టునకుఁ గొమ్మనుటకు నౌఁ • బట్టనంగ
భేదమునకు మూలమున కౌ•వే ఱనంగ
ఫలమునకు వృద్ధునకుఁ దగుఁ • బం డనంగ
దాసహృదయకాసారకా•దంబ సాంబ. 89

టీ. 1 బల్ల=కడుపులోనిగడ్డ, తూము. 2 పఱపు (పఱచు ధాతువు కృదంతము)=పాన్పు, వైశాల్యము. 3 వెన్నెల=జ్యోత్స్న-చంద్రునికాంతి, నమస్కారము. 4 పగలు(ఏకవచనము-పగ)=విరోధములు, దినము (ఈయర్థంబున 'పగలు' అనునదే ఏకవచనము.) 5 పేఁట=అంగళ్లపరుస, ఒకనూలిపోఁగు. 6 నెమ్మి=నెమలి, స్నేహము. 7 వాడ=పసుపువాసన, వీథి. 8 వలి=చలి, గాలి. 9 పట్టు=పట్టువస్త్రము, పూనికి, తీసికొనుము అనుట (ఈయర్థమున నిది క్రియ). 10 వేఱు (అలఘురేఫము)=భేదము. వేరు (లఘురేఫము) = చెట్టువేరు. 11 పండు=ఫలము, ముసలివాఁడు.

సీ. సాముకూటమునకు • సరస కౌ గరిడి నా
సౌరును ములికి యౌఁ • దీ రనంగ

హయశాలకును బాగ ♦ కమరుఁ బాగా యన
మావి కామ్రమున కౌ ♦ మావి యనఁగఁ
గాహళి కొకచెట్టు ♦ కలదు బూరుగు యన
జడితికి విరతి కౌ ♦ వడి యనంగఁ
హొన్నున కుపకృతి ♦ కొనరు మేల్మి యనంగ
మురువును సొగసు నౌ ♦ మురు వనంగ
తే. గళుకునకుఁ గంపకోట కౌ ♦ వెలుఁ గనంగ
మాను మనుటయుఁ దరువు నౌ ♦ మా ననంగఁ
జేవడికిఁ బోలిక కెసంగుఁ ♦ గైవడి యన
డమరుశూలపాశాంకుశా♦డంబ సాంబ. 90

టీ. 1 గరిడి=సాముచేయుచోటు, సమీపము. 2తీరు=కాంతి, బాణము-ములికి. 3 పాగా=లాయము, తలగుడ్డ. 4 మావి=గుఱ్ఱము,మామిడిచెట్టు. 5 బూరుగ=శాల్మలీవృక్షము, (బూరగ)వాద్యభేదము. 6 నడి = వేగము, పద్యమందలియతి. 7 మేలిమి (మేల్మి)=బంగారము, ఉపకారము. 8 మురువు(మురుగు(=చేతికడియము, అందము. 9 వెలుఁగు=ప్రకాశము, వెలుగు=పశువులు రాకుండుటకై చేలచుట్టు నాఁటుకంప(ఈయర్థమున అరసున్న లేదు) 10 మాను=విడుచు (క్రియ.), చెట్టు (నామము.) 11 కైవడి-చేతియురవడి (సమస్తనామపదము,) పోలిక (అవ్యయము).

సీ. ఘూకంబునకుఁ జెవి♦గూబ కౌ గూబన
శిశువును బులియు నౌఁ ♦ జిఱుత యనఁగ
సంధ్యవార్చుటకు సం♦జకు సందె యనఁ బొల్చుఁ
బక్షియుఁ దరువు నౌఁ ♦ బాల యనఁగ
నొకమ్రాకునకు వాతె♦ఱకు మోవి యనఁ జెల్లు
రిక్కయు బొట్టు నౌఁ ♦ జుక్క యనఁగఁ

గూఁటకు శ్వాసానకుఁ జెలంగు నూర్పన
హెచ్చు నెక్కుటయు నౌ నెక్కుడనఁగ
తే. గుచమునకుఁ దల్పుచీలకు గుబ్బ యనఁగ
బక్కకును గుణపమున కౌ బడుగ నంగ
దళసరికిఁ బర్ణమునకు నౌ దళ మనంగ
శంబరాంకకపర్దావలంబ సాంబ. 91

టీ. 1 గూఁబ=గుడ్లగూఁబ, చెవిలోపలిరంధ్రము. 2 చిఱుంత=బిడ్డ, పులి. 3 సందె=సంధ్యావందనము, సంధ్యాకాలము. 4 పాల=పాలపక్షి, పాలచెట్టు, క్షీరికవృక్షము. 5 మోవి=వృక్షవిశేషము, పెదవి. 6 చుక్క=నక్షత్రము, తిలకము. 7 ఊర్పు=శాకము, ఊపిరి. 8 ఎక్కుడు = అధికము, ఎక్కుట. 9 గుబ్బ = స్తనము. తలుపుచీల. 10 బడుగు = చిక్కినవాఁడు, పీనుఁగు. 11 దళము (దేశ్యము)=దట్టమయినది, (సంస్కృతము) ఆకు.

సీ. లేపన మెత్తకు లేపుటకుఁ దనర్చు
డాలనఁగాఁ గాంతి డాలుఁ బరఁగు
నాఁడనఁ దగు నాదినమునకు సీమకు
మించన జడలకు మీఁటుట కగు
మోడి నానల్కకు బైఁడితున్కకుఁ జెల్లు
బారన బార యీరాఱు నొనరు
దండనాఁ జెంతకు దామంబున కెసంగు
సరి యన దండకు సమమున కగుఁ
తే. దోర మనఁగను స్థూలము నోముదార
మమరు నాటి త్తిగయును నూఁగారునగును
గ్రుడ్డనఁగ నండమున కంధకునకుఁ బొసఁగు
నంబరతరంగిణీజటాడంబ సాంబ. 92

టీ. 1 లేపు=పొన్ప (నామము.), లేపుట (క్రియ). 2 డాలు=కాం తి, డెక్కెము. 3 నాఁడు=ఆదినము(అరసున్నయున్నది.), నాడు=దేశము (అరసున్నలేదు.). 4 మించు=మెఱుపుఁదీగె (నామము), మీఱుట(క్రియ). 5 మోడి=కోపము, బంగారుతునుక. 6 బార=చాఁచినరెండుచేతులపొడువు, పండెన్నిండు. 7 దండ = సమీపము, పూలదండ. 8 సరి=దండ, సాటి. 9 నోరము=లావయినది - నోముదారము. 10 ఆఱు=ఒకసంఖ్య - ఏదునొ క్కటి, రోమావళి. (ఈయర్థమున ఆరు అని రూపము.) 11 గ్రుడ్డు = అం డము - గుడ్డివాఁడు.

సీ. కొప్పనంగను వింట♦కొనకును గబరి కా
నెన్ను నా నెన్నున ♦ కెన్నుట కగు
న బ్బనంగఁ దండ్రి ♦ కగపడమికిఁ జెల్లు
నప్ప యనఁగఁ దండ్రి ♦ కక్క కమరుఁ
గలు పన మడిలోని♦ కసవును బెరుఁగు నా
బా సన నానకు ♦ భాష కలరు
డ బ్బన గవ్వకు ♦ డంబంబునకుఁ బొల్చు
మే లన మరులకు ♦ మెచ్చున కగుఁ

తే. బా లగును క్షీరమునకును ♦ భాగ్యమునకుఁ
గమ్మ యనఁ బత్త్రికకుఁ జెవి♦కమ్మ కెనయుఁ
బాప యన బిడ్డకును గను ♦ బాప కెనయుఁ
దాపసోత్తమవినుతిక♦దంబ సాంబ. 93

టీ. 1 కొప్పు=వింటికొన, స్త్రీలకొప్పు. 2 ఎన్ను=కంకి (నామము) తలంచు(క్రియ). 3 అబ్బ=తండ్రి(కళ), దొరకఁగా (ద్రుతాంతము-అబ్బక అని రూపము.). 4 అప్ప=తండ్రి, అక్క. 5 కలుపు=చేనిలోనికసవు, పెరుఁగు. 6 బాస=భాష, ప్రమాణము. 7 డబ్బు=డంబము, ధనము, గవ్వ.

8 మేలు=కోరిక, మెచ్చుకొనుట. 9 పాలు=క్షీరము, భాగ్యము. 10 కమ్మ=చెవిసొమ్ము, జాబు. 11 పాప=బిడ్డఁడు, కంటిపాప.

సీ. పెర యనఁగాఁ దేనె ♦ పెరకు వింతకుఁ బొల్చు
మెఱుఁ గనఁ గాంతికి ♦ మించున కగు
బండ నాఁ దిట్టుకుఁ ♦ బలుగుఱాతికిఁ జెల్లు
బంతి నాఁ జెండును ♦ బంక్తియు నగుఁ
బెరుఁ గన దధికిని ♦ వృద్ధికిఁ దనరారు
వేఁట నా గొఱియకు ♦ వేఁట కమరు
వెలి యన బయటికి ♦ వెల్లనకుఁ దనర్చు
వీడన వదలును ♦ వీడు నలరు
తే. మబ్బనగ మందుసొక్కును ♦ మబ్బును నగు
బులు గనఁగ లాంఛనమునకుఁ ♦ బులుఁగు కొదవు
నా లనఁగ గోవులకు భార్య ♦ కతిశయిల్లు
శంబరాహితమదభిదా ♦ డంబ సాంబ. 94

టీ. 1 పర (ల. రే.) తేనెతెట్టె, పెఱ (అల. రే.) = అన్యుఁడు. 2 మెఱుఁగు=కాంతి, మెఱుపు. 3 బండ=తిట్టు, పలుగుఱాయి. 4 బంతి=చెండు, వరుస. 5 పెరుఁగు= దధి (అరసున్న), వృద్ధియగు (అరసున్న లేదు క్రియ). 6 వేఁట=వేఁటాడుట, గొఱ్ఱె. 7 వెలి=బయలు, తెలుపు. 8 వీడు=వదలు (క్రియ), పట్టణము (నామ). 9 మబ్బు=మందుసొక్కు, మేఘము. 10 పులుగు=గుఱుతు, పక్షి (అరసున్న). 11 ఆలు=గోవులు (బహువచనము) భార్య (ఏకవచనము).

సీ. గురు వన నొజ్జకుఁ ♦ బరువునకుఁ జెలంగు
నారి నా యల్లెకు ♦ నాతి కెనయు

నూరనఁ బల్లెకు ♦ నూరువునకుఁ బొల్చుఁ
తమి యన రాత్రికిఁ ♦ దమికి నమరుఁ
గరి యన దంతికిఁ ♦ గప్పునకుఁ దనర్చుఁ
జింత నాఁ దింత్రిణి ♦ చింత యొనరు
మూల యనఁగఁ గోణ♦మునకు రిక్కకుఁ జెల్లు
మను వన బ్రతుకును ♦ మనువును నగుఁ

తే. గూట మన శిఖరమునకు ♦ గుంపున కగు
జాతి యన నన్వయమునకు ♦ జాతి కెనయుఁ
బురి యనఁగ నెమ్మితోఁకకుఁ ♦ బురికిఁ దనరు
సకలసురచక్రవర్తి శ్రీ♦సాంబమూర్తి. 95

| పదము. | సంస్కృతమైనపుడు. | తెనుఁగయినపుడు. |
|---|---|---|
| 1. గురువు | ఉపాధ్యాయుఁడు | పరువు |
| 2. నారి | స్త్రీ | అల్లెత్రాడు |
| 3. ఊరు | తొడ | గ్రామము |
| 4. తమి | రాత్రి | కోరిక |
| 5. కరి | ఏనుఁగు | కటి=నలుపు |
| 6. చింత | విచారము | చింతచెట్టు |
| 7. మూల | నక్షత్రము | కోణము |
| 8. మనువు | ఒకరాజు | బ్రదుకు |
| 9. కూటము | కొండకొన | గుంపు |
| 10. జాతి | జాజిపువ్వు | కులము |
| 11. పురి | పట్టణము | నెమలిపింఛము. |

క. నిస్తులలక్షణకవి యగు
కస్తూరీరంగసుకవి ♦ ఘటియించినయీ
సిస్తగునాంధ్రనిఘంటు ప్ర
శస్తంబై వెలయుఁగాత ♦ జగతిని సాంబా. 96

తా. ఓ సాంబమూర్తీ! సాటిలేని లక్షణవేత్తయగు కస్తూరిరంగ సుకవి రచించిన యీ మేలగునిఘంటువు పుడమిని ప్రసిద్ధమై వెలయును గాక.

క. ఈరుచిరాంధ్రనిఘంటు మ
హారూఢి వహించి మించి ♦ యారవిశశిభూ
తారక మై తారక మై
తారక మగుఁ గాత సుకవి♦తతులకు సాంబా. 97

తా. ఓసాంబమూర్తీ! ఈయుపయుక్తమయిన తెలుఁగునిఘంటువు మిక్కిలి వన్నె కెక్కి, యన్నినిఘంటువులను మీఱి, సూర్యచంద్రనక్షత్రములున్నంతవఱకును సుకవిజనులకు పదార్థసందియములను దీర్చి కడ తేర్చినదై శాశ్వతమయి యుండునుగాక.

నానార్థవర్గ సమాప్తము.

సాంబనిఘంటువు సమాప్తము.

# శ్రీరస్తు.

# సాంబనిఘంటువు.

## అకారాదిశబ్దానుక్రమణిక.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1920.

# ఆంధ్ర గ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రభారతము—3 సంపుటములు | | 12 | |
| ,, | ఆది, సభాపర్వములుగల సంపుటము ... | 2 | |
| ,, | అరణ్యపర్వముగలసంపుటము ... | 2 | |
| ,, | విరాటోద్యోగపర్వములుగలసంపుటము ... | 2 | |
| ,, | భీష్మద్రోణ పర్వములు ... | 2 | |
| ,, | కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ... | 2 | |
| ,, | శాంతిపర్వము ... | 2 | |
| ,, | { ఆనుశాసనిక అశ్వమేధ ఆశ్రమవాస మౌసల మహాప్రస్థానికస్వర్గారోహణపర్వములు గలసంపుటము } | 2 | |
| ,, | ఆదిపంచకము, ఒకటేసంపుటము ... | 5 | |
| ,, | యుద్ధపంచకము ... | 3 | |
| ,, | శాంతిసప్తకము ... | 3 | |
| ఆంధ్రభారత విమర్శనము ... | | 0 | |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము ... | | 0 | 1 |
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు ... | | 0 | |
| లంకావిజయము, (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు. లక్ష్మణకవి కృతము, కాలికోబైండు ... | | 1 | |
| కృష్ణరాయవిజయము, కుమార, ధూర్జటి కవికృతము ... | | 0 | |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు ... | | 3 | |
| నిర్వచనోత్తరరామాయణము ... | | 1 | |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఉత్తరరామాయణము, కంకంటి. పాపరాజప్రణీతము, చక్కనికూర్పు | 2 | 0 |
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి ... | 1 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనికూర్పు ... | 3 | 8 |
| గోపీనాథరామాయణము, శ్రీమద్రామాయణమునకు సరియైన పద్యకావ్యము. కవనము మిక్కిలి సొంపుగానుండును. రెండుసంపుటములు | 5 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కగ ముద్రితము ... | 0 | 12 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 1 | 12 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, దళసరికాగితములు, చక్కనికూర్పు | 3 | 8 |
| వసుచరిత్ర విమర్శనము, ఆత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుగలవు. ... | 1 | 0 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు ... | 2 | 4 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది ... | 0 | 14 |
| కాశీఖండము ... | 1 | 8 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగ నున్నది ... | 4 | 0 |
| డిటో మేలుప్రతి, చక్కనిబైండు ... | 6 | 8 |
| డిటో అత్యుత్తమప్రతి ... | 8 | 0 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వాశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కగ ముద్రించియున్నాము. శ్రీ కృష్ణదేవరాయలయొక్క ప్రతిమ యిందుగలదు | 2 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 8 |
| హారవిలాసము ... | 0 | 12 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, పీఠికవిపులము ... | 2 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కఁగ మరల ముద్రించినారము | 3 | 8 |
| సారంగధరచరిత్రము, చేమకూర. వేంకటకవికృతము ... | 0 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర ... | 1 | 8 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము ... | 0 | 6 |
| రాజయోగసారము, ద్విపద ... | 0 | 4 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు ... | 2 | 0 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 12 |
| విజయవిలాసము, చేమకూర. వేంకటకవికృతము ... | 0 | 8 |
| బిల్హణీయము, చక్కనికూర్పు ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, ... | 0 | 8 |
| రంగరాయచరిత్ర, దిట్టకవి. నారాయణకవి ప్రణీతము ... | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు. రామభద్రకవికృతము... | 1 | 8 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి. తిమ్మకవికృతము ... | 0 | 4 |
| రసికజనమనోభిరామము, శుద్ధప్రతి ... | 0 | 12 |
| రుక్మిణీపరిణయము ,, ... | 0 | 6 |
| రాజశేఖరవిలాసము, కూచిమంచి. తిమ్మకవిది. ... | 0 | 8 |
| పారిజాతాపహరణము ... | 0 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము ... | 0 | 12 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి, అబ్బయామాత్య ప్రణీతము ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము ... | 1 | 4 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక. అనేక నూతనాంశములు చేర్చి చిన్నసైజున ముద్రించినారము. టీక, వివరణము మిక్కిలి విపులము. ఇదివఱకు ప్రకటితమైన ప్రతులకన్న బాగుగనున్నది. సాధారణప్రతి ... | 2 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| వేంకటాచలమహాత్మ్యము, తరిగొండ వెంకమ్మప్రణీతము, చక్కనికూర్పు | | 1 | 0 |
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 0 | 12 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | ... | 1 | 0 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము | . | 1 | 8 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగ్గడ, క్రొత్తకూర్పు | ... | 0 | 12 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | ... | 0 | 10 |
| సులక్షణసారము, సటీక | ... | 0 | 12 |
| ఆంధ్ర బ్రహ్మాండపురాణము | ... | 5 | 0 |
| దసరాపద్యములు | ... | 0 | 2 |
| ఆంధ్ర నామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు—<br>టీకానుక్రమణికాసహితము, కాలికోబైండు | ... | 1 | 2 |
| అప్పకవీయము, చక్కనికూర్పు | ... | 1 | 10 |
| బసవపురాణము, పిడుపర్తి. సోమనాథకృతము | ... | 2 | 0 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| డిటో బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో | ... | 1 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము | ... | 1 | 8 |
| మాతృశతకము | ... | 0 | 2 |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు | ... | 1 | 4 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభువుకృతము | ... | 0 | 6 |
| సుమతిశతకము, సటీక | ... | 0 | 3 |
| కుమారీశతకము సటీక | ... | 0 | 3 |
| దాశరథిశతకము ,, | ... | 0 | 4 |
| మానసబోధశతకము ,, | ... | 0 | 3 |
| భాస్కరశతకము ,, | ... | 0 | 4 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| కలువాయిశతకము | ... | 0 | 4 |
| జగన్నాయకశతకము | ... | 0 | 2 |
| కవిచౌడప్పశతకము | ... | 0 | 2 |
| నృసింహశతకము | ... | 0 | 2 |
| చంద్రశేఖరశతకము | ... | 0 | 2 |
| రామలింగేశశతకము, అడిదము. సూరకవిది | ... | 0 | 3 |
| కాళహస్తీశ్వరశతకము, ధూర్జటికవిది | ... | 0 | 2 |
| కుక్కుటేశ్వరశతకము, కూచిమంచి. తిమ్మకవిది | ... | 0 | 3 |
| దేవకీనందనశతకము | ... | 0 | 2 |
| కృష్ణశతకము | ... | 0 | 2 |
| నారాయణశతకము | ... | 0 | 2 |
| కాళహస్తిశతకము ('సాంబశివా మహాప్రభో') | ... | 0 | 2 |
| సింహాద్రినారసింహశతకము | ... | 0 | 3 |
| భద్రాద్రిరామశతకము, పావులూరి. మల్లనకృతము | . | 0 | 2 |
| ప్రసన్నరాఘవశతకము | ... | 0 | 3 |
| చిత్తబోధశతకము | ... | 0 | 3 |
| అంబరీషోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| భోగినీదండకము, బమ్మెర. పోతరాజప్రణీతము | ... | 0 | 1 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి | . | 0 | 8 |
| నలోపాఖ్యానము సటీక, చిన్నసైజు | ... | 0 | 8 |
| నలచరిత్ర, ద్విపద | ... | 0 | 14 |
| శ్రీనాథునివీథినాటకము | ... | 0 | 2 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది | ... | 0 | 5 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 2 |

# ఆంధ్రగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు | ... | 1 | 4 |
| ప్రబంధరత్నావళి | ... | 1 | 8 |
| వెంకయ్యవ్యాకరణము | ... | 0 | 3 |
| ప్రౌఢవ్యాకరణము | ... | 0 | 12 |
| బాలవ్యాకరణము, చిన్నయసూరిగారిది | ... | 0 | 12 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక, శుద్ధప్రతి | ... | 0 | 8 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, చక్కనికూర్పు | ... | 0 | 12 |
| ఆంధ్రచంద్రాలోకము, సటిప్పణము | ... | 0 | 8 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 4 |

## నాటకములు.

| | | | |
|---|---|---|---|
| విచిత్రపాదుకాపట్టాభిషేకము | | 0 | 12 |
| కృష్ణాకుమారినాటకము, శ్రీ సీతారామకవిగారిది | ... | 0 | 10 |

## వచనము.

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము. వేంకటరంగశాస్త్రిగారిది | ... | 7 | 0 |
| సంగ్రహరామాయణము, సులభశైలి, శ్రీశేషాద్రిశర్మకృతము | | 0 | 10 |
| సంస్కృతనాటకకథలు, శ్రీ సీతారామశాస్త్రికృతము, సులభశైలి | | 1 | 4 |
| దశకుమారచరిత్రము, శ్రీ ఎనమచింతల. సంజీవరాయశాస్త్రికృతము | | 1 | 8 |
| శివాజీచరిత్ర | ... | 0 | 8 |
| శ్రీరామానుజాచార్యచరిత్ర | ... | 0 | 2 |
| శ్రీశంకరాచార్యచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 3 |
| రామకృష్ణపరమహంసచరిత్ర ,, | ... | 0 | 2 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| బాలగంగాధరతిలకుగారిచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 4 |
| దాదాభాయి నౌరోజీచరిత్ర ,, | ... | 0 | 2 |
| అనిబిసెంటుచరిత్ర ,, | ... | 0 | 4 |
| వివేకానందస్వామి జీవితము ,, | ... | 0 | 2 |
| శ్రీకృష్ణదేవరాయచరిత్ర ,, | ... | 0 | 3 |
| స్వామిరామతీర్థజీవితము ,, | ... | 0 | 2 |
| సూరతు కాంగ్రెస్సు ఉపన్యాసములు | ... | 0 | 2 |
| శ్రీగైక్వాడుగారి ఉపన్యాసములు | ... | 0 | 2 |
| సోదరినివేదితజీవితము | ... | 0 | 2 |
| దక్కనుపూర్వకథలు. శ్రీసీతారామశాస్త్రికృతము, క్రొత్తకూర్పు | | 1 | 8 |
| మర్యాదరామన్నకథలు, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| రేచుక్కపగటిచుక్క కథలు ,, | ... | 0 | 3 |
| మైరావణచరిత్ర ,, | ... | 0 | 2 |
| ఈసబునీతికథలు, క్రొత్తకూర్పు 1-వ భాగము | ... | 0 | 6 |
| డిటో 2-వ భాగము | ... | 0 | 8 |
| షేక్స్పియర్ నాటకకథలు, సులభశైలి | ... | 1 | 8 |
| అరేబియన్ నైట్స్కథలు, చక్కనికూర్పు | ... | 1 | 4 |
| లార్డుక్లైవు జీవితము | ... | 0 | 8 |
| గురుజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | ... | 3 | 0 |
| తారాభాయి, చక్కనినవల | ... | 0 | 12 |
| ఆనందమఠ, నవల, నూతనముద్రితము | ... | 0 | 12 |
| ఐవన్హో, నవల | ... | 0 | 8 |
| మదాలస ,, | ... | 0 | 10 |
| మనోహరి, టి. యస్. రామశాస్త్రిగారిది | ... | 0 | 12 |
| టిప్పుసుల్తాన్ | ... | 1 | 4 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ...తారామము, శ్రీతల్లాప్రగడ. సూర్యనారాయణరావుగారిది | | 1 | 2 |
| ...న్మాదిని నవల | ... | 0 | 4 |
| ...రాధారాణి ,, | ... | 0 | 4 |
| ...రమానందశిష్యులకథలు | ... | 0 | 3 |
| ...తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 4 |
| ...తిచంద్రిక, చిన్నయసూరిగారిది, చిన్నసైజు | ... | 0 | 8 |
| ...ంచతంత్రము, వచనము, సులభశైలి | ... | 0 | 8 |
| ...ామదాసచరిత్ర, చక్కనికూర్పు, మంచికాగితములు, ఇందు శ్రీరామదాసుగారి ప్రతిమకూడకలదు | ... | 0 | 12 |

## వేదాంతము వగైరా.

| | | | |
|---|---|---|---|
| ...ధ్యాత్మరామాయణకీర్తనలు, చక్కనిప్రతి, చిన్నసైజు | ... | 0 | 8 |
| ...ద్వైతసంగ్రహము, వచనము | ... | 0 | 2 |
| ...ానుదేవమననము, వచనము, చక్కనికూర్పు | ... | 0 | 14 |
| ...చారచంద్రోదయము ,, | ... | 0 | 12 |
| ...బ్దార్థచంద్రిక, అకారాది ఆంధ్రనిఘంటువు | ... | 3 | 12 |

# శ్రీ మహాభక్తవిజయము.

ఇదివఱకు ఆంధ్రభాషలో సర్వాంగ సుందరమైన భక్త...జయము ప్రకటింపఁబడియుండలేదు. శ్రీపాద. సుబ్రహ్మణ్య...శాస్త్రిగారిచే వ్రాయించి ఈమహాభక్తవిజయము ప్రకటించు...న్నారము. శ్రీశాస్త్రిగారి మృదుమధురమగుశైలి, ముద్దులు...మూట గట్టుపదరచన, మనోహరమగు వర్ణనాక్రమము ఆంధ్ర...దేశీయులకు తెలియనివిగావు. వెల ప్రతి 1-కి రూ. 4-0-0

ఆంధ్రగ్రంథములు.

ప్రతి 1-కి రూ. ౧

# శ్రీవివేకానందవిజయము.

ఇందు శ్రీ స్వామివారిజీవితము, ఉపన్యాసముల జాబులు విపులముగ వ్రాసి ప్రకటించినారము.

ప్రతి 1-కి రూ. 1-12.

# రాజర్షి, నవల

ఇది శ్రీయుత రవీంద్రనాథ ఠాకూరుగారి బంగాలీన లకు తెనుఁగు తర్జుమా. ఆంధ్రమునం దిట్టినవల అచ్చుకా దని చెప్పవచ్చును. మానవజీవితమందుఁ గలుగు ప్రోత్సాహవ లిం దద్భుతముగ సమన్వయింపఁబడినవి. ఆత్మతత్త్వము బ తత్త్వముతో లగ్నముచేసి జీవయాత్రనడప సాధనము చూ బడియున్నది. ప్రస్తావనలో ఆంధ్ర, ఆంగ్లనవలాచరిత్రలు విపు ముగ వ్రాయఁబడియున్నవి. గ్రంథకర్తలుకూడ గమనింప సిన అంశము లనేకములిందున్నవి.

ప్రతి 1-కి రూ 0-14-

# సీతారామాంజనేయసంవాదము, సటీక.

అనేకనూతనవిషయములఁ జేర్చి చిన్నసైజున చక్క ముద్రించినారము. ఇదివరకు ప్రకటితములైనగ్రంథములక ఈకూర్పు బాగుగనున్నదని గ్రంథము చూచువారికి తెలియ బోదు.

సాధారణప్రతి 1-కి రూ. 2-0-0. గ్లేజుప్రతి 1-కి రూ. 3-8-

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

